శ్రీ ర స్తు.

# రుక్మిణీ పరిణయము.

కూచిమంచి - తిమ్మకవి ప్రణీతము.



చెన్నపురి :

ళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1923

శ్రీ ర స్తు.

# రుక్మిణీపరిణయము.

కూచిమంచి - తిమ్మకవి ప్రణీతము.



చెన్నపురి :

వ. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1923

శ్రీ రామకృష్ణపరబ్రహ్మణే నమః.

# రుక్మిణీ పరిణయము

---

## పీఠిక.



నగజాగజాననులు చేరి నెఱిం దనమస్తకంబుపై
జానగు చందమామఁ గని చయ్యన నద్దము వెన్నముద్దయుం
గా నెలమిం దలంచి యది గైకొనఁ బూని కరంబు లెత్తు నో
మానక వారిముగ్ధతకు మాటికి నవ్వు శివుం భజించెదన్. 1

సీ. మఘవముఖాఖిలామరభూరిసామ్రాజ్యభారధౌరేయతాకారణములు
కుంభినీధరధరణాంభోజసంభవస్ఫారాభిలాషప్రపూరణములు
బహుజన్మకృతఘోరపంకావళిస్ఫురద్వారిభృజ్ఝంఝూసమీరణములు
పద్మదానవమహాసద్మపద్మాకరప్రాతామితోన్మత్తవారణములు
తే. సతతపాలితమునిసిద్ధచారణములు, క్రూరరుగ్జంతుభయవినివారణములు
శైలకన్యాకటాక్షప్రసారణములు, వెలఁగి భక్తాళి కభయంబు నేయుఁగాత. 2

సీ. ఆభీరహితశీలు హరితనూజాలోలు నంచితార్జుననగహారలీలుఁ
బాలితామరగోత్రుఁ బ్రబలగోరిపుజైత్రుఁ జంద్రభాస్వద్రుచిచారునేత్రుఁ
బరిహృతాసమబాణు నరవాహసంత్రాణుఁ బరనిగమప్రథనప్రమాణు
నరకదుర్మదనాశు నాకప్రచురకేశు ఖరమయూఖాభచక్రప్రకాశు
తే. సుభగఖగరాజకేతువిస్ఫురదనంతు, భువనవిపులార్చనీయకపుణ్యవంతు
సాధుబృందావననిశాంతు సమురజయుని, శాంతు దాంతు రమాకాంతుఁ దగ భజింతు.

క. శరణార్థి నగుదుఁ బ్రముదిత, కరికిన్ ధృతగిరికి హృతమకరికిన్ నరకే
సరికిన్ బరిపాలితగ, హ్వరికిం దరికిం జితోద్యదరికిన్ హరికిన్. 4

సీ. చలువపూఁదమ్మిబల్గాలఁకులాడెడుచోట్లు కటిచేలము నెనుఱొమ్ము గద్దెపీఁట
తోరంపుఁబాలమున్నీరుపుట్టినయిల్లు చిలుకతత్తడిరౌతు వలపుఁగొడుకు
తెఱగంటియన్నలందఱు నాడిగపుఁజెలులు కలుములీనెడు కడకంటిచూపు
విరిసిల్లి ప్రాఁబలుకులు గిలుకుటందెయల్ తొగలసంగడికాఁడు తోడఁబుట్టు

తే. వేదమాదేవికలరు నయ్యగురుఁబోఁడి, కమలజునితల్లి నతజనకల్పవల్లి
యిందిరాసుందరాంగి మన్మందిరమున, నిండువేడుక ననిశంబు నిలుచుఁగాత. 5

ఉ. ఫాలతలంబునందుఁ గరపద్మయుగంబు ఘటించి మ్రొక్కెదం
బాలితసిద్ధకిన్నరనభశ్చరమానిసురాళికి న్దయా
శాలికి భారతీవదనసారసబాలమయూఖమాలికిన్
క్షాళితదోషపాళికి జగన్నుతశీలికిఁ దమ్మిచూలికిన్. 6

సీ. చంపకోత్పలమహాస్రగ్ధర సుస్వరమణిమాలికానర్గగుణమనోజ్ఞ
మత్తకోకిలవాణి మానితవిచికిల స్తబకవర్ణవిభాగతరలహార
సరసేందువదన బంధురకాంతిసంయుక్త సరసిజనయన సుందరవరాంగి
నిత్యవిభూతిమానిని రుచిరోత్సాహ ప్రాద్యభేదాఖండపరమశక్తి
తే. యతినుతశ్లోకఛందోమయప్రకాశ, యసముభజనరతగణామితానుమోద
యైనవాగ్దేవినాదుజిహ్వాగ్రమునను, నిలిచి సత్కావ్యగుంఫన నెఱపుఁగాత 7

చ. అనుదినముం మదిం జలన మానక మానక పూని దీనులన్
మనుచుచుఁ గార్యవేళల నుమాధవ మాధవముఖ్యు లౌసురల్
దను వినుతింప మేలిడుచుఁ దానగు దానగుణాఢ్యుఁ డంచు నిం
పెనయఁగఁ గోరి మ్రొక్కెదుదు నేనిఁక నే నికమోముసామికిన్. 8

ఉ. పాయనిభక్తితోడ మదిఁ బ్రస్తుతిసేసెద దీనరక్షణో
పాయుని యోగమార్గనిరపాయుని సంతతరామకార్యధౌ
రేయుని దివ్యకాయుని వరిష్ఠవిధేయుని శిక్షితోగ్రదై
తేయుని నప్రమేయుని సుధీజనగేయుని నాంజనేయునిన్. 9

క. వితతాగమశరణుండై, ప్రతిదినగూఢపదచరవిభాసితుఁడై ది
వ్యతరవిరాడ్విగ్రహుఁడై, ధృతిఁగేరు నజేయు వైనతేయుం గొలుతున్. 10

క. తవిలి నవప్రభ లెసఁగఁగ, భువిఁ గేరెడుమిత్రజాతబుధగురుభాస్వ
త్కవిమాహేయకలానిధి, కువలయచక్రారివంచకులఁ బ్రణుతింతున్. 11

సీ. గురుతరకౌండిన్యగోత్రవిఖ్యాతుండు బయ్యనామాత్యుఁడే భవ్యతాత
నిరతాన్నదానవర్ణితయశస్సాంద్రుండు తిమ్మనసచివుఁ డేధీరుతండ్రి
ఘనులు జగ్గనయు సింగనమంత్రియును నరసన్నయు నేమంత్రి యనుఁగుఁదమ్ము
లలరఁ దిమ్మకవిరాజన్న జగ్గనయును సూరన యేధన్యుసుతవరేణ్యు
తే. లానరసిరమ్మ పాపమేఘునునిసహజ, లతిపతివ్రతలక్ష్మి యేచతురరాణి
యట్టి శ్రీకూచిమంచివంశాబ్ధిచంద్రు, మజ్జనకు నలగంగనామాత్యుఁ దలఁతు. 12

క. క్షితి నతిచతురత లననా, రచనఁ జనహితము లైనరామాయణభా
రతము లొనర్చినజగద, ప్రతిముల వాల్మీకిశక్తిపౌత్రుల నెంతున్. 13

ఉ. ఆరయ సంస్కృతోక్తిరచనాంచితకావ్యధురీణులై భువిన్
భూరియశంబుఁ గైకొనినపుణ్యుల నామది సన్నుతించెదన్
భారవికాళిదాసశివభద్రుల భోజనృపాలబాణులన్
జోరమయూరమాఘులను సువ్రతుశౌభవభూతిముఖ్యులన్. 14

చ. స్థిరమతి నన్నయాహ్వయునిఁ దిక్కన నెఱ్ఱన భీమనార్య భా
స్కరు నమరేశుఁ బోతకవిచంద్రుని సోముని శంభుదాసునిన్
నిరతముఁ బ్రస్తుతింతు నవని న్మహితాంధ్రకవిత్వవైభవ
స్ఫురణఁ బ్రసిద్ధులైనకవిముఖ్యుల భూప్రసుతేన్సమాఖ్యులన్. 15

క. సారము గలచో నలరుచు, నేరము గలచోటు మిగుల నిందింపక స
త్కారుణ్యంబునఁ గనుఁగొను, సూరికవీంద్రుల నుతింతు సురుచిరభక్తిన్. 16

ఉ. శంక యొకింతలేక కవిసంఘముఁ జూచి వృథా వివాదముల్
బింకముతోడఁ జేయుచును బెద్దమంచును బద్యమెల్లఁ గు
శ్శంకలు సేయుచున్ గవితసార మెఱుంగక సారెసారెకు
న్వంకలు వేయుదుష్కవిగణంబుల నెల్లఁ దృణీకరించెదన్. 17

వ. అని నిఖిలదేవతాప్రార్థనంబును, గురుచరణస్మరణంబును, పురాతన నూతన మహా
కవి వర్ణనంబును, కుకవి నిరాకరణంబును గావించి, మఱియు నిష్టదేవతాప్రార్థ
నంబు చేసెద. 18

సీ. చిన్నివెన్నెలతేఁడు చెన్నైనసికపువ్వు పసమించుపులితోలుపట్టుసాలు
చిలువలఱేకిమీఁదుబలుమానికపుఁదాళి వాలుంపుఁదెలిగిబ్బవారువంబు
గఱికిపూజల మెచ్చుగారాబుకొమరుండు వలిగొండకూఁతురు వలపుటింతి
జేజేతుటుములెల్లఁ జేరి కొల్చెడుబంట్లు నునుపెండిగుబ్బలియునికిపట్టు
తే. నగుచుఁ జెలువొందఁ భువనంబు లనుదినంబు, రమణఁ బాలించునిన్ను నేఁ బ్రస్తుతింతు
బుధనుతవిలాస పీఠికాపురనివాస, కుముదహితకోటిసంకాశ కుక్కుటేశ. 19

సీ. బృందారకామందమందారవీతౌఘబృందారవిందాక్షునందనీయ
పాటీరవర్ణేందుకోటీరగౌరీవధూటీసతాదిత్యకోటితేజ
క్షోణీరథాంభోధితూణీరగంగాప్రవేణీరవామోదపాణిహరిణ
నీహారవాగ్భామినీహారహారానిలాహారవర్యాశ్వవాహనార్వ
తే. శర్వసర్వజ్ఞదుర్వహాఖర్వగర్వ, సర్వపూర్వామరోదగ్రశార్వరహర
సారసుకుమారసంతతోదారవీర, చారుతరకుక్కుటాకారజయసుధీర. 20

క. చిరతరముగ నానేర్చిన, కరణిన్ రచియించి నీకుఁ గావ్య మొసఁగెదన్
సుగుణదోషము లెల్లను, బరిహార మొనర్చి దయను బాలింపు శివా. 21

క. అని విన్నవించి కావ్యం, బొనరింపఁగఁ బూని మొదల నుద్యద్గతి దే

వున కిఁ బగుపీఠాపురి, ఘనతర మగుమహిమ మెన్నఁ గావలయు నొగిన్. 22

సీ. పాదగయాక్షేత్ర పరమపవిత్రంబు పురుహూతికాంబకుఁ బుట్టినిల్లు
యేలానదీజలావృతతటాకానీక మఖిలశక్తులకు విహారభూమి
తోరంపులవణపాథోనిధితీరంబు నిర్మలగౌతమీనికటసీమ
కుంతిమాధవదేవుగురుతరస్థానంబు విలసితభీమమండలతలంబు
తే. సేతుకాశీప్రయాగాద్యశేషదివ్య, తీర్థరాజంబులందుఁ బ్రతిష్ఠఁ గాంచి
సకలదోషాపనోదకశక్తి నలరు, పుణ్యసారంబు పీఠికాపురవరంబు. 23

సీ. చక్రవాళాహార్యజలధితుల్యోన్నతప్రాకారపరిఖావిరాజితంబు
సాంద్రముక్తాసౌధచంద్రశాలాసేకభద్మనిర్మితహర్మ్యశర్మదంబు
కరిసైంధవాందోళికాధేనుధనధాన్యవనదేవగృహసరోవర్ణితంబు
విపులచాతుర్వర్ణ్యవిద్వత్కవిశ్రేష్ఠవటనటామాత్యవిస్ఫారితంబు
తే. రాజమాహేంద్రనరదుర్గరాజ్యభూరి, ఘోరసంఘరణాక్రాంతభాసమాన
రావుమాధవనృపపరిరక్షితంబు, భోగనికరంబు పీఠికాపురవరంబు. 24

## షష్ఠ్యంతములు.

క. ఏతత్పురనేతకు ఘన, దాతకు గోష్పదప్రశమితధాతకు భువన
త్రాతకు సకలాగమవి, జ్ఞాతకు శీతాచలేంద్రజామాత కొగిన్. 25

క. ఖండనపరఖండనకర, మండనశరచాపఖడ్గమహనీయున కా
ఖండలమణికుండలఘృణి, మండలఫణిరాజరాజమానాంగునకున్. 26

క. కమలాధిపసఖునకు ధృత, కమలునకు మునిస్తుతాంఘ్రికమలునకు లస
త్కమలధతూణీరునకును, గమలశిరోజునకు సమధికమలహరునకున్. 27

క. నారదపారదశరద, శారదశరచాభ్రకరితుషారాభ్రఝరీ
తారాహితహీరామృత, ధారామితసితవిలాసదరహాసునకున్. 28

క. వృషవర్ధనునకుఁ గిన్నర, వృషసఖునకు రిపుమదేభవిదృతముఖునకున్
వృషసేవితచరణునకును, వృషవాహనజనకునకును వృషవాహునకున్. 29

క. హరిమణినిభకంధరునకు, హరిమదమథనునకు నిశితహరిబాణునకున్
హరిపతికేయూరునకును, హరికోటిసమానకాంతిహరిణాంగునకున్. 30

క. సంగరజయునకుఁ గుక్కుట, లింగస్వామికి నవీనలీలావిలస
ద్భృంగిరిటినటనరతునకు, గంగాజూటునకు దివిజగణసేవ్యునకున్. 31

వ. అనంతసాష్టాంగదండప్రణామంబులు సమర్పించి తత్కృపాతిశయంబున నద్దేవతా
సార్వభౌమునకు నంకితంబుగా నారచియింపంబూనిన రుక్మిణీపరిణయంబను మహా
కావ్యంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 32

# ప్రథమాశ్వాసము.



—— కథాప్రారంభము. ——

క. అనుపమగుణుఁ డగుసూతుఁడు, మునుకొని మును శౌనకాదిమునులకు వినయం
బున భాగవతపురాణము, ఘనభక్తిఁ బ్రవిస్తరంబుగా నెఱిఁగించెన్. 33

గీ. అవ్విధంబు పరీక్షిజ్జనాధిపునకు, ఘనుఁడు శుకయోగి దెల్పుచోఁ గౌతుకంబు
పల్లవింపంగ రుక్మిణీపరిణయప్ర, కార మెఱిఁగింపుఁ డని రాజు గోరుటయును. 34

క. ధీవరుఁ డాశుకుఁడు జగ, త్పావన మగుతత్కథావిధం బెఱిఁగింతున్
గేవలభక్తి చెలంగ మ,హీవల్లభ విను మటంచు నిట్లని పలికెన్. 35

సీ. శ్రీకారణాభ్యున్నతాకారసన్మణిప్రాకారసౌధవ్రజాకరంబు
సోపానసవప్రజగోపానసీచిత్రరూపానవద్యోరుగోపురంబు
గంభీరహితవిమానసుంభీరయుక్తాంబుగంభీరపరిఖావిజృంభణంబు
శీలావరోధేందుశాలానికీర్ణేంద్రనీలావళీకుడ్యజాలకంబు

తే. సదసమసుమసుమశరవ్యసనవసుని, వసనసంత్యక్తగత్నసారసనవసన
రసికయోషానుమోదకశ్వసనశిశువి,సరవిశాలంబు కుండినపురవరంబు. 36

మ. మహి నవ్వీడు చెలంగునిందుమణిహర్మ్యశ్రేష్ఠాంగనాచారువి
గ్రహవిద్యుత్కచనీలవారిధరవిభ్రాంతిస్వచేతోముహు
స్మహురుద్భాసితవారియంత్రపతితాంభోబిందుసందోహసం
గ్రహణోదంచితచాతకప్రకరమై రంగత్ప్రకాశోన్నతిన్. 37

చ. అరుగఁగ సంచరించుతురగావలిపీచులు తూర్యఘోషముల్
సలితభామినీరదనసారసముల్ ఘనరాజహంసముల్
చెలఁగుపదాలువన్నియపసిండి మెఱుంగులుమంగుదిన్నెలున్
గలిగి పురంబు భాసిలు జగద్వినుతామరగంగయో యనన్. 38

ఉ. అన్నగరంపుఁగుందనపుహర్మ్యతలంబుల నాడుబాలికల్
పున్నమరేలు చందురునిఁ బోల్పుగఁ గన్గొని యాటవేడుకం
జెన్నుగ నెన్నొసళ్లెదురుసేయుచు దీకొని తాఁక నుర్విపై
నెన్నఁ గళంకి యయ్యె శశి యింతులకస్తురిబొట్టు లంటుటన్. 39

ఉ. ఆపురగోపురాగ్రసముదంచితకాంచనకుంభముల్ మహో
ద్దీపితలీలలన్ మెఱయుధీరత నందులసుందరీజనం
బే పలరుం బయోధరము లీపగిదిం దమ కంచు నిర్జరేం
ద్రాపముచారువక్త్రిలకు నొయ్యనఁ జూపఁగ నిల్పిరో యనన్. 40

గీ. వజ్రిముక్తాబ్జరాగప్రవాళనీల, వితతిచే నొప్పుఁ బురిపణ్యవీథి పుండ
రీకకుముదాబ్జహల్లకాస్తోకనీల, కువలయశ్రేణిచే నొప్పుకొలనుపోలె. 41

చ. నగరవిశాలసౌధశిఖరంబులపై విలసిల్లు నెల్లెడం
జిగిబిగికుందనంపుఁబనిచేసినరత్నపుఁగీలుబొమ్మ లా
గగనమునందు నుండి పురిఁ గల్గువిలాసముఁ జూడఁగోరి వ
న్నెగ నరుదెంచి పాయ కటు నిల్చినయచ్చరకన్నెలో యనన్. 42

ఉ. ఆనగరంబుప్రోవను దినాధిపుఁ డేఁగుచు దారి కడ్డమై
పూనికనున్నకోటఁ గని పోవఁగలేక యిరాఱు మేనులం
దానటు దిద్దు మాటి చనెఁ దథ్యము గాదని యంటిరేని యా
భానుని ద్వాదశాత్ముఁ డనిపల్కఁగఁ గారణమేమి నిచ్చలున్. 43

గీ. సరసులెల్లను బలుమాఱు సంస్తుతింపఁ, గువలయానంద మగుచు నక్కోటచుట్టుఁ
గమనలంకారవైఖరి గడలుకొనఁగ, పరిఖ దనరారు నెపుడు నప్పట్టణమున. 44

చ. పురి కరిబృంద మందముగఁ బున్నమచందురుఁ గాంచి తెల్లదా
మరవిరియంచుఁ దొండము సమందగతిం దివికెత్తఁ దత్సుధా
కరుఁడు ననేకరాహువులుగా మది నెంచి భయంబు మించి దు
స్తరబహుశార్తిఁ గుందుచుఁ గృశత్వమునొందుఁ బదాఱువ్రక్కలై. 45

క. నాగరకరికర్ణోదిత, సాగరముఖమదకదంబసాంద్రఝురీసం
యోగంబువలన జలధికి, సాగరనామంబు గలిగె జగము లెఱుంగన్. 46

క. హరిణము లప్పురమునఁ గల, తురగంబులతోడఁ బోరి తుది నోడి మహా
త్వరితమునఁ బవనహిమకరు, గిరిజేశుల శరణువొందె గేవలభీతిన్. 47

సీ. తపఁబాటుగాఁ బల్కు తలకొట్లబడిరేఁ దా వేదవేదియె యంచు వేధ నెంచి
జగ మెన్నఁ ద్రిదశవేశ్యకుఁ బుట్టెఁ దాఁ గులశ్రేష్ఠుఁడే యంచు వసిష్ఠు నెంచి
యనుజునిల్లాండ్రఁ గూడెను దాను సాధువర్తనుఁడె యంచును శుకజనకు నెంచి
ప్రకటింప సర్వభక్షకుఁడు తా నాచారవంతుఁడే యంచుఁ బావకుని నెంచి
తే. వేదతత్త్వజ్ఞు లత్యంతవిమలకులులు, సాధువర్తను లవికలాచారయుతులు
నైనధాత్రీసురోత్తము లనుదినంబు, పూన్కిఁ జెన్నొందుచుందు రప్పురమునందు.

చ. అమరఁ బదాఱువ్రక్కలు నిరాలు దెఱంగులు నైరి చెల్లఁబో
తమకులకర్తలై నశశితామరసాప్తు లటంచు వారలన్
విమలయశఃప్రతాపముల విస్తరిలంగ నొనర్తు రొక్కటన్
హిమకిరణార్కవంశ్యు లయి హెచ్చినయప్పురిబాహుజోత్తముల్. 49

చ. ధన మెపుడుం బుధావలి కుదారత మీఱ నొసంగి రెంతయున్
ఘనులనఁ బోలి యప్పురిఁ బ్రకాశతఁ గాంచినవైశ్యకోటులన్
ధనదు లటంచు నెన్నక సదా ధనరక్షకుఁ డైనయక్కుబే
రుని ధనదుం డటంచును నరుల్ వచియించుట దోసమేకదా. 50

క. శూద్రులు గల యురుసుగుణస, ముద్రులు సలలితస్వధైర్యమోఘీకృతహే
మాద్రులు ఘోరరణాంగణ, రుద్రులనంబోలి మహితరుచి నవ్వీటన్. 51

సీ. తమగానములకు సంతసిలి పున్నాగముల్ ప్రస్ఫుటభోగసంభ్రమత నలరఁ
దమవిహారముల కెంతయు భూజనుల్ చొక్కి సుమనోవికాసవిస్ఫూర్తిఁ దనరఁ
దమముఖాంభోజగంధములకు సరసాళు లుప్పొంగి మదబుద్ధిఁ గప్పుకొనఁగఁ
దమమణినూపురధ్వనులకుఁ బరమహంసలు పోలి మానసాసక్తి నలమఁ

తే. గేరి మగమీఱి బలుతూపు లేఱి నూఱి, తూఱి నడి నేయుశరంబు లైరిఁ బారిఁ
గూరి వేసారి తముఁగోరి చేరువిటుల, రతులఁ దేలింతు రావారసతులు లందు. 52

ఉ. తమ్ములు మొల్లలుం దొగలుఁ దాసనముల్ విరిపొన్నలున్ శిరీ
షమ్ములు హల్లకంబులును జంపకజాలము లిప్పమొగ్గలున్
సమ్మతి నమ్మఁ జూపి తమచారుతరాననయుక్తి ప్రకా
శమ్మెఱిఁగింతు రెంతయును జాణల కప్పురిఁ బుష్పలావికల్. 53

సీ. చెలిమిఁ గైకొనియెదఁ జెండ్లిమ్ము చెలియన్నఁ గొనుమారు బేరముల్ కొసగ కిప్పుడు
పొదలెడుచివురు సూపెద విది ముద్దియ మేలనఁ బలుగెంపులోలి నింప
సుమకలంబక్రీడ నమరింపుసఖి యన్న నది నీవి వదలింప కనువుగాద
యెల్లవేళల నుండుమల్లికల్ గా వేడ్క ననఁగ మూపురములోఁ గొనియనిచెద

తే. ననుచుఁ దముఁజేరి కేరెడుననుపుకాంత్రుఁ, గనుచు నెఱదంటపలుకులు వినుచు మదినిఁ
బెనుచుమదమున ననలమ్ముకొనుచుమనుచుఁ, బుష్పలావికలందు రప్పురమునందు. 54

సీ. ఈమంజుకుచంబు లీచానయన నివి కొనఁగోర నొక్కింతగొనబొనర్చ
నంటిఫలంబు గైకొంట నీయెడఁదగు నన నటకానిమ్ము వెనుకరమ్ము
నెలఁతమాకందంబు నిగ్గోరుట లనఁగఁ బలుమాఱు కేలికి నలరియుండు
మోవిపంటనుగంటిఁ గావించి చూతునా యనఁ బండుఁ గని యిటు లాడనగునె

తే. యనుచు ఫలములుగొనఁబూనినటులు నిటులు, మొనసి సరసోక్తులాడుచు నెనసి తిరుగు
విటులకింపుగ మఱుమాట వెసనొసఁగుచుఁ, ఫలములమ్మెడిచెలులందు రెలమినందు.

క. ఆనగర మేలుమేలుగ, మానితకీర్తిప్రతాపమహిమోన్నతిచేఁ
బూనికమీఱఁగ భీష్మక, భూనాయకుఁ డెప్పుడు సకలబుధజననుతుఁడై. 56

సీ. కువలయంబున కార్తిఁ గూర్పనియినుఁడు చక్రావళి నేఁచక యలరురాజు
ధర్మహింసనమునఁ దనరనిరాముఁడు భోగినీసురతేచ్ఛఁ బోనివిజయుఁ
డతిరాజసమున మిన్నందనిశూరుఁడు గోత్రాహితుఁడుగాని గోవిభుండు
పరమహంసలఁ బోవఁ దఱుమనిఘనుఁడు నెవ్వడిభంగమొందనివాహినీశుఁ

తే. డనఁగఁ దేజఃకళాన్వపవినుతిశౌర్య, జవవిభవదానగాంభీర్యశాలి యగుచుఁ
బూని తనకీర్తి జగమెల్లఁ బొగడ నెగడె, నన్నెమీఱంగ భీష్మకావనివరుండు. 57

సీ. గుఱుతు దప్పనిభూరిగోత్రధర్మముఁ బూని నిరుపమరాజశేఖరత నలరి
వినుతపాండురవర్ణమునఁ బ్రకాశత మీఱి బుధరక్షణోపాయబుద్ధిఁ జెలఁగి
వలనుమీఱ ననంతవాహినీయుక్తుఁడై భువనాభిరామవిభూతిఁ బొదలి
సంతతాహీనభూషణభూషితాంగుఁడై ప్రియకుమారగణాభ్యుదయ మెలర్పఁ
తే. జారువృషకేతుమహితుఁడై స్మరవిరోధి, కరణి ధరణిఁ జెలంగు వేడ్కల నశేష
జనమనోరథసంధానచతురుఁ డగుచు, వాసికెక్కె నయా నృపాగ్రసరుండు. 58
సీ. తనచంద్రహాసనితాంతవైఖరి మిత్రశత్రులఁ జిరసుఖాస్పదులఁ జేయఁ
దనమహాద్రవిణవిస్తారంబు బుధవీరవరులను నిత్యసవనులఁ జేయఁ
దనకమలాకరధామంబు హంసార్థితతులమానసవిచింతనలఁ జేయఁ
దనదానధారావితతగోసమితి విప్రార్థులఁ బూర్ణజీవనులఁ జేయ
తే. నుండు నుద్దామభుజదండమండనప్ర, చండకోదండపాండిత్యఖండితోగ్ర
భండనోద్దండశౌండారిమండలేశ, మండలుం డామహీస్థలాఖండలుండు. 59
గీ. అతనిపూఁబోణి యొప్పు మత్తాలివేణి, సైకతశ్రోణి వికసితజలజపాణి
పరమకల్యాణి నిజనేత్రనిరసితైణి, సతతవితతగుణశ్రేణి సత్యవాణి. 60
చ. పలుమఱు జాహ్నవిం బరమపావని యందురుగాక యింతయున్
నిలుకడలేక పంకముల నిండుకయుండి విషస్వరూపయై
కలఁగుచు వక్రపద్ధతులఁ గాంతునిశీర్షముఁ ద్రొక్కి నిల్చుఁ దాఁ
దుల యగునెట్టు లవ్వికచతోయరుహాయతచారునేత్రకున్. 61
సీ. నిరతపాతివ్రత్యగరిమ నరుంధతి ననుపమసంపద్వృద్ధి నబ్ధికన్య
నవిరళవాక్యవైభవమున భారతి నిష్టభోగనిరూఢి నింద్రురాణి
నధికక్షమాలీల నవనీవధూటిని విమలసౌందర్యసారమున రతిని
బరమపావనత నంబరచరద్వాహిని నురుతరైశ్వర్యవిస్ఫురణ నుమను
తే. బోలు నితరులఁ దులయనఁ బొసఁగునెట్లు, మనుచు జనులెల్లఁ దనుసముదగ్రసరణిఁ
బ్రస్తుతులు సేయ నభినవప్రాభవమునఁ, జెలఁగు నప్పూర్ణతారేశలలితవదన. 62
తే. ఆసరోజాక్షి క్రమమున నధిపువలన, రుక్మియును రుక్మరథుఁడును రుక్మబాహు
రుక్మకేశులు రుక్మనేత్రుఁడు ననంగఁ, బరఁగుతనయుల నేవురఁ బడసి మఱియు.
క. సిరుల జవరాలియంశము, తిరమై తనకుక్షియందు దీపింపఁగ భా
సురలీల నమరి యాహిమ, కరముఖి యాఱవది యైనగర్భముఁ దాల్చెన్. 64
క. నునుఁజెక్కులు దెలుపారెం, జనుముక్కులు నలుపువాఱె సమమగుచు వళుల్
పెనుసుక్కులు వడిఁ దీఱెం, గనుచొక్కులు మీఱె నంతఁ గంజేక్షణకున్. 65
తే. కాంతగర్భాంతరంబునఁ గమలవేడ్క, నొయ్యనొయ్యనఁ బెరుగుచు నుంటఁ జేసి
మధ్యమున కెప్పుడును జోక మట్టుమీఱఁ, బేదఱికమంతయును దీఱె పెంపుదనరె. 66

తే. పుడమిచేడియ యాపువ్వుఁబోణిగర్భ, మునఁ బ్రవేశించుచున్నదో జననమొందఁ
దలఁచియున మన్మరుచియంచుఁ దవిలి మెసఁగెఁ, గానిచో నింతికిదియేమికారణంబు.

క. అడుగామడయ్యె తోఁచెను, నడుచు నెడం దృణము మేరునగమై తోఁచెం
దొడరి పని సేయు నెడ న, వ్వడఁతికి గణుతింప గర్భభారము పేర్మిన్. 68

చ. తలఁపునఁ గోరికల్ మొలచెఁ దద్దయు దేహము వన్నె గుబ్బచ
న్నులు కడు నుబ్బె నారు సుమనోవనసీరుచిం జెలంగెఁ
బొక్కిలి మఱి విస్తరిల్లెఁ బలుగెంపులసొంపుహసించుమోవియున్
వెలవెలఁ బాఱె నప్పరవిందదళాయతచారునేత్రకున్. 69

క. అలినీలవేణి కిటువలె, నెల లలరఁగఁ దొమ్మిదియును నిండి తగం బ్రొ
ద్దుల నెల మసలుటయును ని, ర్మల మగునొకపుణ్యవాసరంబున నంతన్. 70

క. కలశాబ్ధివీచిలక్ష్మీ, ఫలనం గన్నట్లు మంచిలగ్నంబున సొం
పలరఁగ నజ్జలజానన, కులదీపకయైనముద్దుఁబోఁతుం గనియెన్. 71

తే. పుట్టినప్పుడె కలిచల్లి బొడ్డుగోసి, ఎడి జలకమార్చి తడియొత్తి బడిసిపైచి
మంత్రసానులు బాలికామణినిఁ బ్రేమ, దనర మెత్తనిపొత్తుల నునిచి రొగిని. 72

క. పాలకడలిక్రియ నజ్జన, పాలకసదనంబు మెఱసెఁ బలుమఱు రోలం
బాలకయై విలసిల్లెడు, బాలకతన శుభవిభావిభాసిత మగుచున్. 73

ఉ. అప్పుడు మానవేంద్రుఁడు ధరామరకోటి కభీష్టవస్తువుల్
కుప్పలుగాఁగ నిచ్చి కరిఘోటకహాటకచేలముల్ నయం
బొప్పఁగ బంధువర్గముల కున్నతలీల నొసంగి దీనులం
దప్పక సత్కృపం గని యథావిధిఁ దానములాడి వేడుకన్. 74

తే. పదిదినంబులు పురిటింటఁ బగలు రేయుఁ, బదిలముగఁ గాపులిడి నరపాలుఁ డంత
పురుడు చేయించెఁ దనతోడఁబురుడు సేయఁ, గలరె నృపతులు ధారుణీస్థలి నటంచు. 75

క. జనులెన్నఁ బదునొకొండవ, దినమున బుధనికరమెల్ల దీవన లొసఁగం
దనయనుఁగుందనయకు వే, డ్కను రుక్మిణి యనుచు నామకరణం బిడియెన్. 76

తే. నూనెఁ దలయంటి పసుపున మేను నలఁచి, చలువపన్నీటితోఁ గూర్చి జలకమార్చి
కజ్జలంబిడి ధూపముల్ కడు నొసంగి, పాలు ద్రావించి బాల నుయ్యాల నునిచి. 77

క. జోజో ముద్దులగుమ్మా, జోజో కప్పురపుదిమ్మ జోజో కొమ్మా
జోజో బంగరుబొమ్మా, జోజో వెలలేనిసొమ్మ జోజో యనుచున్. 78

తే. జోలపాడంగ నిదురించి మేలుకాంచి, మేలుకాంచనకింకిణీజాలములు న
టించఁ బదములఁ జేతులాడించుకొనుచుఁ, బోయిపెట్టిన నెఱిఁగి యాహార మొసఁగి.

ఉ. అత్తఱిఁ గ్రొత్తముత్తియపుహర్మ్యతలంబున నిల్పి చిత్తరు
పుత్తడికీలుబొమ్మలను బొంగరముల్ మణికందుకంబులం

జిత్తవికాసమై మిగులఁ జెన్నగువెన్నెలదోఁసపండులన్
మొత్తముగాఁగ నిందుముఖి ముందర నుంచి విలాసవైఖరిన్. 80
ఉ. అల్లదె చందమామ దివినంటి వెలుంగుచు నంటిపండులన్
బెల్లము వెన్న చక్కెరయు నెయ్యిని పాలను జున్ను మీఁగడల్
కొల్లలు మీఱఁ బట్టుకొని కూరిమి నాడుకొనంగవచ్చె రం
జిల్లి చకోరనేత్ర యటు సేయక కన్గొనుమంచు వెండియున్. 81
ఆ. వెండిగిన్నెలోన వెన్నయు బువ్వయుఁ, బసిఁడిగిన్నెలోనఁ బాలునిడుక
చందమామ రావె జాబిల్లి రావె మా, పాపతోడ నాడ మాపులనుచు. 82
క. నెలబాలుఁ జూపి నునుగి, న్నెలఁ బాలును నెయ్యిపోసి నెలఁతుక లాచి
న్నెలబాలకుఁ ద్రావించుచు, నెలమిం గ్రీడింపఁజేసి రింపలరారన్. 83
క. దాదులు వెనుపఁగ నిటు జగ, దాదులకాది యగుమగువ యనిశము సిరులం
బాదుకొని నృపతితిలకం, బాదుకరాఁ బెరుఁగుచుండె నంతగణంకన్. 84
ఉ. అంగదముల్ వెలుంగ మణిహారము లక్కున నర్తిలంగ మే
ల్బంగరురావిరేక నొసలన్ మసలంగఁ బదాంగదధ్వనుల్
పొంగి చెలంగ రంగులను బొన్నగుపావడ సొంపెసంగఁగా
సంగడికన్నెలం దవిలి సారసలోచన క్రీడసేయుచున్. 85
సీ. మేలైన కెంబట్టుజాలె బిగ్గరఁ జుట్టి తిరముగాఁ బసిఁడిబొంగరములాడు
గుజ్జియంటఁ బరువిడ్డతతి యంచియల్ పెల్లుమ్రోయంగ దాఁగురుమూఁతలాడు
గరకంకణధ్వనుల్ ఘలుఘల్లురని యింపు గావింప నచ్చనఁగాయలాడు
నిలువెల్ల జెమట సోనలఁ దోఁగి విలసిల్లఁ దొడరి మానికపుఁగంచుకములాడు
తే. దంటచెయికేరి యోమనగుంటలాడుఁ, బోలురాసిరవెన్నెలపోగులాడు
వేర్మిఁ జెలరేఁగి చిఱుతనబిల్లలాడు, వేడుకలుమీఱఁ బింపిసలాడు మఱియు. 86
సీ. బలుముత్తియంపు మేడలఁ గ్రీడసేయుచు నాఁడుక పసిఁడియుయ్యాల లూఁగుఁ
గమ్మపుప్పొడి మేనఁ గ్రమ్మ లీలావనతరువులఁ బరువంపువిరులు గోయు
బొమ్మపెండ్లిండ్లొనర్చుచును గుజ్జెనఁగూటియామెతల్ రాకన్నియలకు నొసఁగు
సారంపుఁగెంపుపంజరములలోనిడి సుకుమారకీరశారికలఁ బెనుచుఁ
తే. దవిలి నిచ్చలు గౌరీవ్రతములు నోఁచు, నలఘుమతి నింపులగుపాట లభ్యసించుఁ
జెలఁగి భూసురపరిసువాసినులఁ గొలుచు, దాదిగాదన్న పనియె పంతమునఁ జేయు.
క. బింబోష్ఠి లేఁతయగు ప్రా, యంబున నీరీతిఁ గన్నియలఁగూడి ప్రమో
దంబునఁ గ్రీడించుచుఁ జె, ల్వంబున వర్తింపఁ గొన్నివాసరములకున్. 88
సీ. నిద్దంపుబలుసోగనెఱులు క్రొమ్ముడి కందె నెమ్మొగంబునఁ జేట నేటుకొనియెఁ
గనుదోయి నఱసిగ్గుఁ గలికిచూపులు మీఱెఁ జెక్కులనిగనిగజిగి దనర్చెఁ

జెన్నొంద నెఱచిన్నిచన్ను లుద్భవమయ్యె మోవి యొక్కించుక జేవురించె
నూనూఁగునూఁగారు నునుఁజాయదలమయ్యెఁ గటిచక్ర మించుక ఘనతనొందె
తే. నడల నొయ్యొయ్యమురిపంబు గడలుకొనియె, ముద్దుజిలిబిలిపలుకులు మొలచె సొలపు
చిఱుతతెలినవ్వు లంతంతఁ జెలువు మెఱసె, రమణికి నవీనయౌవనారంభమునను. 89
క. సింగార ముప్పతిల్లఁగఁ, బొంగెడుతేజవ్వనంబు పొడమిననపు డ
య్యంగజునిచేఁ జెలంగెడు, బంగరుకీల్బొమ్మ యనఁగ బాలిక యలరెన్. 90
ఉ. అంతటఁ జన్నుదోయి బటువై విలసిల్లె నితంబబింబ మ
త్యంతము విస్తరిల్లె మదనాంకురభావము లుప్పతిల్లె మో
మెంతయుఁ దేజరిల్లె సిరు లీనుచు వేనలి యుల్లసిల్లె న
క్కాంతకు నిండుజవ్వనము కన్నులపండువయై ఘటిల్లుటన్. 91
చ. నిలుకడఁ గన్న క్రొమ్మెఱుఁగు నింగిఁ దొలంగినచంద్రరేఖ యిం
పలరఁగఁ బల్కు పుష్పలత ప్రాణము లున్న పసిండిబొమ్మ చే
ష్టలు గలగుజ్జుమావి ఘనసౌరభ మబ్బినమానికం బనం
జిలుకలకొల్కి యంత విలసిల్లె మనోహరయౌవనంబునన్. 92
ఉ. ఆనవమోహనాంగి యనయంబు నయం బెనయం బుధావళుల్
దానగుణాఢ్యుఁడై నతినతంద్రిసభం బ్రథమాఱ దేవకీ
సూనునిరూపయౌవనవచోబలవైభవముల్ గణింపఁ దాఁ
బూని పయోరుహాక్షుఁడె విభుండు తగం దనకంచు నెంచుచున్. 93
ఉ. ఎన్నఁడు చూతు సారసదళేక్షణుముద్దుమొగంబు శౌరి ద
న్నెన్నఁడు పెండ్లియాడుఁ జెలులెల్లను వేడుక నుల్లసిల్ల న
వ్వెన్నునిమస్తకంబున నవీనము లౌ తెలిముత్తియంపుఁ బ్రా
లెన్నఁడు నింతు వానియెద నెన్నఁడు గూర్మి వసింతు నక్కటా. 94
క. తమవా రాశౌరికి ను, త్తమమతిఁ ద న్బెండ్లి సేయఁ దలఁతురొ లేదో
కమలజుని వ్రాఁత మఱి యే, క్రమమగునో నిర్ణయింపరా దింతైనన్. 95
తే. మోహనాకారుఁడును సదామోదమతియుఁ, జారుకారుణ్యతారుణ్యసంయుతుండు
భాసురైశ్వర్యఖనియునౌ ప్రాణవిభుఁడు, గలుగు టెల్లను జెలిపుణ్యఫలముగాదె. 96
చ. సరసవచోవిలాసనయచాతురిఁ దుల్యతనొంది యామిని
కరముఖియున్ సదాహృదయకౌతుకహేతుకళావిధిజ్ఞుఁడౌ
పురుషుఁడు నెమ్మితోఁ గలసి భూరిసుఖానుభవాబ్ధిఁ దేలుటల్
చెఱకునఁ బండుపండుట పసిండికిఁ దావిఘటిల్లుటారయన్. 97
సీ. వామాక్షులకు వశంవదుఁడైనయాలిలఁ బొటిల్లు ప్రియుఁడు తంగేటిజున్ను
మానినీమణులకు మదనకళాతంత్రకోవిదుం డగుపతి కొంగుపసిఁడి

పువ్వుఁబోణులకు జగత్పూజితాకారుఁ డాపురుషుఁడు వెలలేనిభూషణంబు
అలివేణులకుఁ బూర్ణయౌవనుం డై చెలంగెడుమనోహరుఁడు ముంగిటినిధాన
తే. మబ్జముఖులకు బలవైభవానురాగ, నిరతుఁ డగునాయకుఁడు చేతినిమ్మపండు
ఇన్నిగుణములు శౌరియం దెన్నఁబడియె, నతఁడువిభుఁడౌటకన్న భాగ్యంబుగలదె.
క. సరసోదారధరాధర, ధరమధురాధరసుధాసుధారాసిక్త
స్ఫురదమలతరమృదూక్తులు, పరమానందమున వినెడుభాగ్యం బెపుడో. 99
సీ. పీతాంబరాస్యేందుబింబ మీక్షింపక నయనోత్పలంబు లేక్రియఁ జెలంగు
హరికరాంబురుహవిస్ఫురణ లభింపక కచమధువ్రతము లేకరణిఁ బొదలు
శౌరివక్షఃకవాశ్ర్మమున రాయక కుచకనకకందుకము లేగతిని మెఱయు
దైత్యారివాగ్వ్యాప్తిధారలు సోఁకక శ్రవణకూపంబు లేసరణి మబ్బుఁ
తే. కృష్ణలావణ్యగంగాసరిత్తరంగ, మాలికాడోలికాకేలిఁ దేలి లీలఁ
దేజరిల్లక మానసరాజహంస, మేతెఱంగున సంతతప్రీతి నలరు. 100
ఉ. విందుము ముందు వీనుఁగవ విందుగఁ బొందుగనందు మంద నా
నందము నందముల్ మెఱయ నవ్యవిలాసకళాసమగ్రుఁడై
సుందరమందహాసరుచి శోభిల వ్రేతలఁ గూడి యాడుగో
విందునిఁ జెంద ముల్ జెలులు వేమఱు నేమివ్రతంబు నోఁచిరో. 101
సీ. తనశిరంబున శౌరి తలఁబాలు వోసిన మానికంబులు శంభుమౌళి నునుతుఁ
జేఁగి కృష్ణుఁడు నన్నుఁ జెట్టవట్టిన నుమాధవునకుఁ గేలెత్తి దండ మిడుదు
హరి తనమృదులపదాగ్రంబుఁ ద్రొక్కిన ఫణిహారునకుఁ బ్రదక్షిణ మొనర్తుఁ
బురుషోత్తముఁడు దనపొత్తునఁ గుడిచిన హరునకు నమృతోపహార మిడుదుఁ
తే. జక్రి దనుఁగూడి మంగళస్నాన మొలమి, నాచరించినఁ బురనిశాటాహితునకుఁ
దనరనభిషేక మొనరింతుననుచుఁ బెనుచు, పరిణయోత్సాహమునఁ బల్కెఁ బంకజాక్షి.
చ. చెలులకు నిత్తెఱం గెఱుఁగఁ జెప్పినయప్పుడె గేలిసేయఁగాఁ
దలఁతురుగాని రాజునెపఁ దప్పక యిప్పని యొప్పమీఱఁగాఁ
దెలుపుడుచేసి యొయ్యన మదీయమనోరథసిద్ధిగా శుభం
బెలమిని సంఘటింపఁగల రెవ్వరొకో కృతోపకారులై. 103
క. అని యిత్తెఱఁగున హరిపైఁ, దనరఁగఁ జిత్తంబు నిల్పి తనలోఁ దానే
యనవరతముఁ జింతించుచు, వనజేక్షణ పరమయోగివైఖరిఁ జెలఁగెన్. 104
ఉ. ఆయెడ నొక్కనాఁడు సచివాప్తపురోహితరాహుతాననీ
నాయకగేయకావ్యరతనాటకచేటకచాటుకావ్యసం
గాయకగాయకార్యసముదాయకళానుకళారిభేదనో
పాయవిదుల్ భజింప నిరపాయనృపాయత వైభవంబునన్. 105

సీ. అందమై శంఖవిభాసుందరమై వృతసుధీబృందమై లోచనానంద మగుచు
సారమై భూరివిస్తారమై మకరతద్వారమై యాచకాధార మగుచుఁ
బూతమై భువనవిఖ్యాతమై సజ్జనోపేతమై మధురసంగీత మగుచుఁ
దివ్యమై బహుతరద్రవ్యమై సతతసంభావ్యమై సుభటసంసేవ్య మగుచు
తే. శుంభదంభోజరాగవిష్కంభశాత, కుంభజృంభితవిద్రుమ స్తంభవితతి
జంభజిన్మణిసంభితారంభజాల, జాలకంబైనయొకసభాస్థలమునందు. 106
క. నిండుఁగొలువుండె దయ నధి, కుండన రూపాబ్జసాయకుండన సుగుణాం
కుండన నిశ్శంకుండనఁ, గుండినవిభుఁ డైనభీష్మకుం డనవిభుఁడై. 107
క. అతులగతి నిల్చు కొలువై, హితులున్ బుధతతులు మతిమహితులున్ ధరణీ
పతులున్ బ్రీతిఁ గేరుపురో, హితులున్ సుతులున్ వినంగ నిట్లని పలికెన్. 108
చ. తవిలి మదీయపుత్రి యగుతామరసాయతనేత్ర రుక్మిణిం
బ్రవిమలతేజుఁ డైననరపాలతనూజున కిచ్చి ధారుణీ
దివిజులు రాజులుం బొగడ దిక్కులఁ గీర్తి వెలుంగ భూరివై
భవమునఁ బెండ్లిసేయుటకు భావమునం దిపు డుత్సహించెదన్. 109
క. కులమును రూపము విద్యయుఁ, దెలివియు జవ్వనము నీతి ధృతియున్ మతియుం
గలిమియు బలిమియుఁ జెలిమియుఁ, గలవారునకుఁ గన్య నొసఁగఁగావలె నెలమిన్.
క. దానములలోఁ గన్యా, దానము ఘనపుణ్య మని బుధప్రకరము లిం
పూని వచింతురు గావున, మానవతతి కిది సుకర్మమార్గం బరయన్. 111
తే. తగినవారునకుఁ గన్యకాదాన మొసఁగి, పేర్మి నీరెడుతరములపితరులకును
హర్ష మొనరించియన్వయం బవిరళముగఁ, బావనము సేయుటుచితంబు ప్రాజ్ఞులకును.
క. పెద్దయు శుభకార్యంబులు, పెద్దలతో నూహచేసి పిదపన్ వారల్
దిద్దినరీతి నొనర్చుట, నుద్దామం బైనభద్ర మొదవుచు నుండున్. 113
క. హితకార్యం బతిసత్వర, గతిఁ జేయఁగవలయుఁ బూని ఘనులకు నెల్లన్
క్షితియం దనవద్యంబుగ, స్మృతు లెన్నంగద శుభస్యశీఘ్ర మ్మనుచున్. 114
క. కావున రుక్మిణికిం దగు, భూవర సుతు నాత్మ నరసి పొలుపొందఁగ మా
కావిధ మెఱిఁగింపుఁడు స, ద్భావంబున బుధులు హితులు బాంధవతతులున్. 115
చ. అనుటయుఁ జారుకార్యగతి యారసి యారసికాగ్రగణ్యుఁ గ
న్గొని మనుజేశ నీతనయకుం దగురాజకుమారు మారుఁ బో
లినసుకుమారు ధీరు నవిలీనబలాహవశూరు మాకుఁ దోఁ
చినపగిదిన్ వచించెదము చిత్తమునం గలరీతిఁ జేయుమా. 116
చ. గొన బగురూపభావితునిఁ గోరును గన్నియ వన్నెమీఱఁ ద
జ్జననిధనంబుఁ గోరు శ్రుతశాలిని గోరును దండ్రి చుట్టముల్

ఘనకులజాతుఁ గోరుదు రిలం బరులెల్లను నూపమిశ్రితో
దనము భుజింపఁ గోరుదురు తద్దయు శోభనకార్యవేళలన్. 117

క. అదిగావున మామాటలు, హృదయంబున కిష్ట మయ్యెనేనిఁ బ్రమోదం
బొదవ విను నీవు సతతా, భ్యుదయపరంపరలు చెందు నుర్వీనాథా. 118

చ. యదుకులవార్ధిచంద్రుఁడు దయాగుణసాంద్రుఁ డమందసుందరా
స్పదుఁ డమితప్రతాపుఁడు విశాలయశస్సహితుండు సంతత
త్రిదశగణార్చితుండు వసుదేవతనూజుఁడు కృష్ణుఁ డాతఁడే
మదిఁ బరికింప నీప్రియకుమారిక కాత్మవిభుండు గాఁ దగున్. 119

మ. వసుధాధీశ్వర యమ్మహాత్ముని ప్రభావం బెన్నఁ జిత్రంబు దా
వసుధాభారనివారణార్థముగ మున్ వందారులై భీరులై
వసుదేవాదులు ప్రస్తుతింపఁ గరుణావర్ధిష్ణుఁ డావిష్ణుఁ డీ
వసుదేవాత్మజుఁడై జనించె సుగుణవ్యాపారపారీణతన్. 120

క. నూతనలీలల నందని, కేతనమునఁ బెరుఁగుచుండి కృష్ణుఁడు కడిమిం
బూతన యనియెడు నసురి న, చేతనఁ గావించె భువనచిత్రము గాఁగన్. 121

క. నికటమున దనుజమాయం, బ్రకటం బగుచుండు టెఱిఁగి పటుబలయుతుఁడై
శకటం బొకటి ముకుందుఁడు, వికటంబుగఁ గూలఁదన్నె విబుధులు పొగడన్. 122

సీ. మారుతాసురుఁ ద్రుంచె మద్దులఁ బెకలించెఁ గినిసి వత్సకుఁ జంపెఁ దునిమె బకుని
నఘదానవునిఁ గూల్చె నలరి కాళియు నొంచె దవశిఖి మ్రింగె గోత్రము ధరించె
శంఖచూడునిఁ దేర్చె సాధించె వృషదైత్యుఁ గేశి నణంచె ముగించె వ్యోముఁ
జాణూరుఁ దెగటార్చెఁ జక్కాడెఁ గంసునిఁ దవిలి యొయ్యనఁ గాలయవనుఁ జిదిమె
తే. నలజరాసంధముఖ్యు లఖిలులఁ దతిమె, ద్వారక యనంగ నొకరాజధాని నిలిపె
బాంధవుల కెల్ల నిత్యశుభంబు లొసఁగె, మనుజమాత్రుండె దేవకీతనయుఁ డరయ. 123

చ. సకలబుధానుసారి యగుశౌరికిఁ గన్య నొసంగి భూమినా
యక శుభలీలలన్ వెలయు టందము డెందమునందు నీవు వే
ఱొకనృపసూతికిన్ వికసితోత్పలనేత్ర నొసంగఁ జూచుట
ల్వికటరసాల మొల్లక చలించి ముసిండిఫలంబుఁ గోరుటల్. 124

క. అని సభ్యు లాడుపలుకులు, తనచెవులకు ములుకు లగుచుఁ దగిలినఁ గోపం
బునఁ గటము లదర నందఱుఁ, గనుఁగొని యపు డనియె రుక్మి గర్వోద్ధతుఁడై. 125

చ. అవునవు మంచిపెద్దలె బళా నరపాలునిమోల నూరకే
చివుకుల కొందుఁ జొప్పడనిచేవలు వెట్టుచు గట్టిపట్టుగాఁ
జెవులకు ములుకులై వినఁగఁ జెల్లనిపల్కులు మాటిమాటికిం
దవిలి వచింపఁ జాఁగితిరి దబ్బర లింకను జాలు మానుఁడీ. 126

తే. మదిని మీమాట పరమధర్మం బటంచు, నమ్మియుండినఁ గార్య మెంతయును జెడదె
పెద్ద లనియెడిగంపంతపేరె కాని, బుద్ధి ముదిమది దప్పినఁ గొద్దిగాదె. 127

ఉ. గొల్లలయిండ్లఁ బాల్పెరుగుఁ గొల్లలుగా సతతంబుఁ ద్రావి మ
త్తిల్లి యరణ్యదేశములఁ ద్రిమ్మరుక్రొవ్వులకాపరిన్ గడున్
బల్లిదుఁ డంచు నెన్నెదరు నవ్వెదువారి నెఱుంగ కియ్యెడం
బెల్లుగ గొల్లబోయనికి బింకము బంటుఁదనంబు గల్గునే. 128

చ. చివికినబండి ద్రొక్కుటయుఁ జెట్లు పెకల్చుట పాలాసంగుదా
నవి భువిఁ గూలద్రోయుట వనంబునఁ బామును గొంగ నెద్దు వా
రువమును గర్దభంబును విరోధు లటంచుఁ దునుంచి చంపుటల్
శిసిశివ విక్రమంబు లని చెప్పఁగఁ జిత్రము లయ్యె నియ్యెడన్. 129

క. మంచిది మీపలు కిప్పుడు, వంచింపఁగ వలదు బాంధవమునకుఁ దగునే
క్రించుఁ డయి మేనమామం, ద్రుంచినఖలుఁ డెంతబలయుతుం డై యున్నన్. 130

చ. సరిసరి మీవిచార మిఁకఁ జాలు శిరీషసుమోపమానభా
సురసుకుమార రై సకలసూరిజనాభినుతోల్లసద్గుణా
కర యగురుక్మిణిం బసులకాపరి కియ్య మదిం దలంతురే
గురుతరరత్నహార మొకకోఁతి మెడం దవిలింపఁ జూతురే. 131

క. మీ కిష్టం బని వరచా, వీకరనిభగాత్రి నెట్లు మీఁదెఱుఁగక నేఁ
డాకటిగొల్ల కొసఁగుదురు, కాకి మెడం దొండపండు గట్టినభంగిన్. 132

చ. కటకట సర్వభూభరణకారణభూరిభుజాగ్రజాగ్రదు
త్కటపటుశింజినీనినదకార్ముకముక్తశరాహతారిరా
ట్పటుపటలుండు భీష్మకనృపాలుఁ డనం బ్రథ మీఱి యీతఁడే
కుటిలతనొంది గొల్లనికిఁ గూఁతు నొసంగిన నవ్వరె జనుల్. 133

క. మావాక్యము గొఱగా దని, తా వేఱొక టనుట వడుచుఁదన మిది యనుచున్
భావింపక దయఁ జూడుఁడు, వేవిధములఁ గేలుమొగిచి వేఁడెద మిమ్మున్. 134

తే. ఘనుల కెల్లను దమ డెందమునకు నిష్ట, మగు తెఱంగున నొనరింపఁదగును గార్య
'మాత్మబుద్ధిస్సుఖంచైవ' యనెడువచన, మరయ నిద్ధాత్రిపై నిశ్చయంబు గాదె. 135

క. శశిముఖి యగురుక్మిణి న, వ్వశుపాలున కొసఁగ నొల్లఁ బదివే లైనన్
వశకీకృతపరబలుఁ డగు, శిశుపాలున కిపుడు పెండ్లి సేయుదుఁ బ్రీతిన్. 136

ఉ. సంగరరంగరంగదరిసామజభీమజవప్రదీపితో
త్తుంగమృగేంద్రుఁ డంగభవతుల్యమనోహరమూర్తి భూమిభృ
త్పుంగవవర్ణనీయపరిపూర్ణగుణాకరుఁ డిందుచంద్రికా
భంగయశోన్వితుండు శిశుపాలుఁడు చూడ నృపాలమాత్రుఁడే. 137

తే. అనుచుఁ బెద్దల నదలించి యాదురుక్మి, మాట గాదన నపుడు భీష్మకన్నృపాలుఁ
డొనర నారాజునకుఁ గన్య నొసఁగఁదలఁచి, యవిరళామోదమానసుఁ డై చెలంగె.

క. అని శౌనకాదిమునులకు, ఘనుఁ డాసూతుండు దెలుపుగతినిఁ బరీక్షి
జ్జనపతికి శుకుఁడు చెప్పిన, విని యవ్వలికథయుఁ దెలియ వినఁగోరుటయున్. 139

మ. పరమాత్మాబ్జభవాచ్యుతార్చితపదాంభోజాతశీతావనీ
ధరకన్యాకుచకుంభసంభృతలసత్కస్తూరికాశాద మే
దురనోఽంతిరహాంబహీరశరగోదుగ్ధేందుదత్నావళీ
శరదభ్రభ్రధునీసితాభ్రశశభృత్సంకాశగాత్రప్రభా. 140

క. కనకాచలసుచిరశరా, సన కాకోదరవిభూష సనకాదిసదా
వనకారణసుహాకరిముఖ, జనకానుతచరిత దీనజనకార్యరతా. 141

తరల. సమరభీషణ సత్యభాషణ సారసాహితభూషణా
సమదవారణ చర్మధారణ సంతతాగమకారణా
ప్రమథనాయక భద్రదాయక పద్మలోచనసాయకా
శమనశిక్షక సాధురక్షక శత్రుగర్వవిమోక్షకా. 142

మాలిని. సరసగుణకలాపా సర్వలోకప్రదీపా, సురుచిరతరరూపా శోషితాశేషపాపా
పరిహృతసుమచాపా భాసురోగ్రప్రతాపా, నిరుపమహరిరోపా నిత్యసత్యానులాపా.

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్య ధురంధర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర బుధజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతం బైన రుక్మిణీపరిణయం బను శృంగారప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.

---


రుచిరతరసితాంగా
కారుణ్యమయాంతరంగ కలుషవిభంగా
పారావారనిషంగా
గోరాజోన్నతతురంగ కుక్కుటలింగా. 1

తే. అవధరింపుము మును శౌనకాదిమునుల, కనఘుఁ డాసూతుఁ డెఱింగించినట్లు వ్యాస
సుతుఁడు సుమహితకౌతుకోన్నతి నిభరత, కులునకవ్వలికథయును దెలుపఁదొడఁగె. 2

క. నరవర విను భీష్మకభూ, వరుఁ డాక్రియఁ బుత్రునకును వశుఁడై పుత్రీ
పరిణయకార్యారంభ, స్ఫురణం జెలరేఁగి యొక్క శుభకరవేళన్. 3

ఉ. రమ్ము రయంబె కుండినపురమ్మునకున్ సచివాప్తబంధుజా
తమ్ములఁ గూడి నీ కవితథమ్ముగ నిచ్చుట రుక్మిణిన్ వివా
హమ్మొనరింతు రాజనివహమ్ములు మెచ్చఁగ నంచు జాళువా
కమ్మ లిఖించి పంచెఁ గుతుక మ్మురన్ శిశుపాలుపాలికిన్. 4

ఉ. పంచినరేఖఁ గాంచి శిశుపాలుఁడు తద్దయు నుత్సహించి య
త్యంచితకాంచనాంబరచయంబున దూత కిప్పు డి
ప్పించి సమస్తబాంధవులఁ బెద్దల సంగడికాండ్ర నెల్ల ర
వించి వివాహలేఖఁ జదివించిన వారలు సంభ్రమించుచున్. 5

తే. మంచిపనియయ్యె నిప్పుడు భీష్మకునితోడఁ, జుట్టఱికమబ్బె నెంతయు సులభమగుచు
నిందులకు సంశయింపంగ నేటి కింక, శోభనోద్యోగ మాచరించుట మతంబు. 6

చ. అదియునుఁగాక రుక్మిణియొయారము సార మయారె సారెకున్
వదలక భూసురేంద్రు లనవద్యగతిన్ నుతిసేతు రా నవాం
బుదనికరోపమానకచఁ బోలరు పన్నగరాజకన్యలున్
సదమలసిద్ధసాధ్యసురచారణకన్యలు రాజకన్యలున్. 7

చ. అలికులవేణియుం బిసరుహాననమున్ నిడువాలుఁజూపులుం
జిలిబిలిపల్కులుం దళుకుఁజెక్కులు కెంజిగురాకుమోవియుం

గులుకుమిటారిగుబ్బలను గొప్పపిఱుందులు లేఁతనవ్వులుం
గలయలరుక్మిణిం బొగడఁగాఁ దరమే పరమేష్ఠికేనియున్. 8
ఉ. సారము ముద్దుఁబల్కు ఘనసారము నిద్దపుమేనితావి కా
సారము నాభిరంధ్రము విసారము తేటమిటారిచూపు శ్రీ
కారము కర్ణయుగ్మము చొకారము నవ్వుమొగంబు పట్టదా
కారము కొప్పు సన్మధువికారము మోవి వధూలలామకున్. 9
క. కనకంబే మెయివన్నియ, కనకంబే ముక్కు విమలకమలేక్షణకున్
ఘనమే జఘనము మేచక, ఘనమే చకచకల నలరు కచ మంగనకున్. 10
క. లికుచంబులుగద జవరా, లికుచంబులు తేంట్లు పైఁదలికచంబులు తే
మకరంబులు కెందమ్ములు, మకరంబులు జంఘ లాహిమకరాననకున్. * 11
తే. మంద మానడ వెన్నడుమంద మాన, ఖంబు కుచపాళి కనకకుంభంబుడంబు
చందమామకుఁ దుల మోముచంద మామ, నోజతూపులు చూపులు రాజసుతకు. 12
సీ. తరుణేందుబింబంబుఁ దచ్చంద్రికాతతి నదలించునాననహాసములను
దంతికుంభంబులఁ దద్గమనంబుల నపహసించునురోజయానములను
దర్పకాశుగములఁ దచ్ఛరాసనములఁ బూని యోడించుదృగ్భ్రూయుగములఁ
దామరపువ్వులఁ దద్బిసశ్రేణులఁ బరిభవించువరాంఘ్రిబాహువులను
తే. శరధివీచులఁ దన్మహాసైకతముల, గదుముఁబొదలువళిత్రయికటితటములఁ
జంపకంబులఁ దన్మృదుసౌరభముల, మొనయునాసాంగవాసనలను వధూటి. 13
క. ఆకామిని నుద్వాహం, బై కామునిఁ గెల్చి చిరతరానందరసా
స్తోకగతిన్ వసియించుట, నాకాధికసౌఖ్యలీల నలరుట సుమ్మీ. 14
ఉ. మంచముకోటఁ జేసె యిడుమాడ్కిఁ దనంతనె తానె యిప్పు డా
చంచలనేత్ర నీఁదలఁచి సారయశుం డగుకుండినేశ్వరుం
డంచితలీలఁ గాంచనమయం బగుశోభనలేఖ యంపి పి
ల్పించినయప్పు డేటికివలెన్ మతి జాగిఁక నంచు నెంచుచున్. 15
క. భృత్యులఁ దీర్పరు లైనయ, మాత్యులఁ గన్గొని ప్రమోదమతి నఖిలజన
స్తుత్యముగ మంగళోచిత, కృత్యము లొనరింపుఁ డనినఁ గేరుచు వారున్. 16
క. పరిపరివిధముల నమరన, గరిగరిమన్ మెఱయుపురి జగన్నుతగతి వా
విరి విరివిగ నలరఁగఁ జే, సిరి సిరి కిర వగుచుఁ గ్రొత్తచెలువు దలిర్పన్. 17
తే. శిల్పకకళాదలేపకచిత్రకార, రజకమాలికకుంభకారకకువింద
చర్మకారకముఖ్యుల సరగఁ బిలిచి, వలయు నర్హ్యోపప్రయోజనంబులు ఘటించి. 18
క. దివ్యము లగుకల్యాణ, ద్రవ్యములుం గూర్చి సద్ముదంబున నిఁకఁ గ
ర్తవ్యం బెయ్యది యనుటయు, భవ్యమతిం బోరిడ లైనబంధువు లెల్లన్. 19

గీ. నెమ్మి యనుపెండ్లిలగ్నంబు నిర్ణయించి, కమ్మ వ్రాయించి యాభీష్మకక్షితీశు
భటునితోఁ గూర్చి మఱితమభటునినొకని, నొనరఁ గుండిననగరికిఁ బనుపుటయును.

క. ఆభటు లిరువురు బలజి, వైభవుఁ డగుకుండినేంద్రు దర్శించి వెసన్
శోభనపత్రిక యొసఁగఁ జి, రాభినవానందమందహాసానను డై. 21

క. మణికల్యాణాంచితభూ,షణము లనేకంబుగా నొసంగి నృపాగ్రా
మణి కల్యాణాంచితభా, షణములఁ జేదీశభటుని సంతసపఱిచెన్. 22

ఉ. అంతట వాని వీడ్కొలిపి యాప్తుల బాంధవకోటులన్ మహీ
కాంతులఁ బిల్వఁబంచి శుభకారణవస్తువులెల్లఁ గూర్చి పీ
పంతయు వింతమీఱఁగ రయంబ యలంకృతి సేయఁ బంచు న
త్యంతకుతూహలం బలర నాజ్ఞ యొసంగినఁ బౌరు లందఱున్. 23

ఉ. గోడల నెల్లఁ జిత్తరువు గూరిచి నిద్దపుఁజందమామరా
మేడ లలంకరించి జిగి మీఱఁగఁ బల్లవహల్లకంబులం
గూడినరత్నతోరణపుఁగోటు లమర్చి బహిర్విహారపుం
జాడల వీథివీథులను జల్లిరి సారపటీరనీరముల్. 24

క. నిగనిగజిగిఁ బొగడఁగఁ దగు, పగడపుఁగంబములు నించి పఱపుదలిర్పం
సొగసుగ ముత్తెపుఁబందిరు, లగణితముగ నిల్పి రప్పు డాకస మొరయన్. 25

ఉ. రంగుగ మేలిబంగరు మెఱుంగుటరంగుల నంగనామణుల్
పొంగుచు రంగవల్లికలు పోఁడితనంబుల వ్రాసి వాసి మీ
ఱంగ మృగీమదంబుఁ గపురంబును సాంకవమున్ మెదించి యు
త్తుంగకపోతపాలికల దోర మెఱర్పఁగ మెత్తి రత్తఱిన్. 26

తే. పురములోపల రత్నగోపురములెల్లఁ, గరము మెఱయ నలంకృతి నెఱి నొనర్చి
భూరిశోభాసమేతప్రభూతశాత, కుంభకుంభంబు లామీఁదఁ గుదురుపఱిచి. 27

క. నగరులలోపలఁ గపురము, నగరులధూపములుఁ బెట్టి యతిశయగతి న
న్నగరిపునగరికి సరియె, న్నఁగ నగణితలీలఁ జెలు వొనర్చిరి వరుసన్. 28

వ. అప్పు డప్పురవరంబు మరకతమణికృతవితతవిభావిభాసితోన్నతజాకలజాలకాంతర్ని
ష్క్రాంతాగరుధూపధూమశ్యామాభ్రభ్రమామితకామిత లీలాఖేలనలోలశాలానీల
కంఠానీకంబును, ప్రతినికేతనకేతననూతనవితానశతానర్ఘ్యమణినికాయకాయమాన
విరాజమానంబును, నవరత్నకీలితలాలితశోభాసమానభాసమానానూనమానవేశనివేశ
ద్వారాపార ప్రమోదపూరణకారణతోరణావలంబ బింబఫలశంకాంకురకరామలకమ
లరాగోపలచాపలభావభావన్మహోత్సుకశుకనికరంబును, ఘనఘనసారసారసారంగి
మదామోదకహిమోదక ధారావారాభిషిక్తసంసక్తముక్తాఫలచూర్ణకీర్ణనిరర్గళ రాజ
మార్గంబును, సభాభవనభువనాద్భుతకరారచిత రుచిరతరవ్యాజరాజీవరాజోన్ముఖనా

రంభ సంరంభ సమయసమర్యాదాకుంఠిత కపటకంఠీరవభైరవాకార విలోకనభీతభీతమాతంగవ్రాతంబును, ధాళధళ్యప్రభాపూరహీరశిలాబద్ధస్నిగ్ధకుడ్యాంతర్నిహితమహిత ముకురనికురుంబబింబితాభ్యర్ణస్వర్ణస్తంభోజ్జృంభమాణమాణిక్యఖచిత పాంచాలికాబాలికావదనేందుబింబచుంబనలాలస బాలిశయువజనభజనాభిరామంబును, ప్రభూతశాతకుంభకుంభరంభాస్తంభశుంభద్బహిర్ద్వారప్రదేశంబును, రంగత్కురంగమదాగరుచందన చంద్రాకలంక సంకుమదాదికామోదశాద మేదుర వేదికాంగణదేహళీమోహనంబును, సురుచిరదరీమహాంతర నిరంతరనిద్రారత ఘూరత రేభాహితోత్థసన్నద్ధహేతుకకౌతుకప్రణాదిత విదితమురజదరఝర్ఝరపటుపటహకాహళభూరిభేరీభాంకారనినదంబును, సువాసినీకృతమంగళగానానురూపతానమాన సంధానకగోపురోపరిపరిస్ఫుటత్కనకఘటాంతర్న్యస్తప్రశస్తలీలారవిందనిష్యందన్మరందపానానందితసుందరేందిందిరబృందామందమధురఝంకారంబును, నిరతభరతకళాకౌశలప్రణర్తితనర్తకీజనఘనస్వేదోదకాపనోదకమహోద్యాననానాసుగంధగంధిలసౌగంధికసారససౌరభ్యసరస సరసీతల శీతలమారుత చారుతరంబును, విలసితఫలకుసుమవిసరాపసరనైవేద్య సద్యోఘృతయుతపూపసూపాన్నధూపదీప వాటీరపీఠీరాజన్నీరాజనపూజనాలంకృతదేవతాయతనంబును, హాటకతాటంకకంకణకింకిణీవలయ తులాకోటికోటీర హారకేయూర గళాభరణచరణ కటకోర్మికాంచకాంచీముఖనిఖిలవిభూషణాంబరమాల్యానులేపనప్రదీపిత సకల యువయువతీజనమనోహరంబును, బహువిధవర్ణోల్లిఖిత చిత్రలీలాతిరస్కృత తిరస్కరిణీజాతజాతరూపనిర్మిత నిర్మలహర్మ్యభిత్తికానిచయంబును, మకర నికరాహీన మీన తిమీన ఢులీ కుళీర దుర్ధర దర్దురోద్రేకగాంభీర్యకుంభికుంభీర నీరాధార పరిఖావిహారమాణ మానసౌకఃకోకాద్యఖిల ఖగకుల కలకలరావానుకూలతాల ప్రమాణమానిత పూర్ణకుంభసంభారాతిమందయానానుకరచిరంటీమంజుమంజీరనినదంబును, పవనజవననిరాఘాట ఘోటకబంధురసింధురారోహణకోణకృపాణబాణబాణాసనాద్యనేకాయుధాభ్యాసవాసవాసనాప్రవీణగణనీయకుమారవర్గంబును, చతురచతురాగమపారగోర్వీసురభాసురాశీర్వాదనాదవేదనాదామోదకరంబునై త్రిదివంబునుంబోలె వివిధబుధపరికరాకరంబై వైకుంఠపురంబునుంబోలె ననవరతలక్ష్మీనివాసంబై కైలాసస్థానంబునుంబోలె సర్వమంగళాలంకృతంబై సత్యలోకంబునుంబోలె నతులితశతానందంబై రసాతలంబునుంబోలె నవిరళకంచుకిసమంచితంబై యొప్పె నంత. 29

క. ఇత్తెఱఁ గంతయుఁ దనచెలి, కత్తె లెఱింగింప విని మొగంబున దైన్యం
బత్తుకొన నపుడు రుక్మిణి, చిత్తము దత్తఱము నొందఁ జిడిముడిపడుచున్. 30

తే. కటకటా రుక్మి యన్యాపకర్ముఁ డిప్పుడు, చేదిభూనాథునకుఁ బెండ్లి సేతు ననుచుఁ
బూని యున్నాఁడు వాని కీబుద్ధి మాన్పి, తవిలి శౌరికిఁ గూర్చువా రెవరు గలరు.

క. వినయవిహీనుం డగుచును, దనయానతి మీఱి తిరుగుతెనయానుమతిం
బని యొనరింపఁగ దొరఁకొనె, జనకుండును వేఁదురగుచుఁ జంచలబుద్ధిన్. 32

చ. చెఱకున బండు లుద్భవము సేయక బుద్ధివిహీనుఁ డై ఫలో
త్కరము మునింపఁడిచెట్టునకుఁ గల్గఁగఁజేయుచు నున్న క్రైవడిన్
హరిహర పాపజాతివిధి యానవమాలికిఁ గూర్ప నొల్ల కీ
పరమనికృష్టుఁ డైనశిశుపాలున కేక్రియఁ గూర్పఁ జూచెనో. 33

చ. సరసగుణాభిపూర్ణుఁ డగుశౌరిపదాంబుజసేవ సేయఁగా
మరిమరి గోరుచిత్తమిఁక మక్కువ నన్యులఁ జేరఁ గోరునే
నిరతశుభాకరామరధునీపృథునీరవిరాజమూర్తికా
పరిచితరాజహంస మొకపట్టున పచ్చికపట్టుఁ జేరునే. 34

క. హైమవతి కిపుడు నాపై, ప్రేమ మదిం గలిగెనేని వెస నొనఁగూడున్
దామోదరసాంగత్యము, దామోదరసాభ్యుదయనిధానం బగుచున్. 35

సీ. కృష్ణమేఘ మురోజగిరిశృంగములమీఁద మెఱపు దీపింపఁగా మెలఁగు టెపుడు
మెలఁగి గంభీరవాగ్విలసితనిర్ఘోషములచేతఁ బలుమాఱుఁ జెలఁగు టెపుడు
చెలఁగి కృపారసోజ్జ్వలజలధారలు మరిమరి దఱచుగాఁ గురియు టెపుడు
కురిసి మనఃక్షేత్రగురుతరతాపాగ్ని యుడుగ నిర్భరలీలఁ దడుపు టెపుడు
తే. తడిసి సంతతసౌఖ్యప్రదంబు లగుచు, మెండుకొని కామసస్యముల్ పండు టెపుడు
నిపుణమతి నూహయొనరింప నపుడుగాక, తొలఁగునే దైన్యమతియెల్లదూరమగుచు.

ఉ. మారునిఁ గేరుచారుసుకుమారుని నందకుమారుని న్మనో
హారుని మానిమానసవిహారుని సన్మణిహారునిన్ రమా
ధారుని ఘోరశాత్రవవిదారుని శశ్వదుదారునిన్ సదా
చారుని భక్తరక్షణవిచారుని నేక్రియఁ జూడఁగల్గునో. 37

ఉ. ఎవ్వరి వేఁడుకొందు మది నెంతని మోహము నిల్పుకొందు నిం
కెవ్వరు పంకజాయతిదళేక్షణుఁ దోడ్కొని తెచ్చి యాత్మలో
నెవ్వగ మాన్పఁ జాలుదురు నీలబలాహకవర్ణుఁ డెప్డు తా
నివ్వసుధేశ్వరాధముల నెల్ల జయించి వరించు నన్ గృపన్. 38

సీ. వికసితవిశదారవిందబృందంబులు గిరిరాజసుత కొసంగినఫలంబు
కలితప్రభాపూరకర్పూరపారతుల్ శివవధూమణికి నిచ్చినఫలంబు
మధురతామోదితమధురసంబుల జగజ్జనని కర్పణ మొనర్చినఫలంబు
కమనీయకల్హారసుమదామములు చండికకుఁ గూర్చి యిడిననిక్కపుఫలంబు
తే. కొదవఁ బొదవక యిపుడొనఁగూడెనేని, నందనందనుఁ డతులితానందుఁ డగుచు
నను గృపాదృష్టి వీక్షించి నగుచు మధుర, భాషణంబులచేఁ గరస్పర్శ సేయు. 39

క. హరినీలోపలనిభుఁ డగు, హరి నీలోపలనె తెచ్చి యవనిపులెల్లం
బరిభవ మొందఁగ నాకుం, బరితోష మొనర్చుపుణ్యపురుఁ డెవ్వఁడొకో. 40

క. అని కజ్జలజలధారలు, కనుఁగవ దొరఁగఁగ దురంతఘనతరచింతా
వినమితముఖి యగుకాంతా, జనరత్నముఁ గాంచి యొక్కసఖి యిట్లనియెన్ 41

క. ఘనుఁ డగుభీష్మకజనపరు, తనయవు సతతప్రకాశితనయవు సిరులం
దనరినదానవు మానస, మున నిటు వగ పేటికమ్మ ముద్దులగుమ్మా. 42

తే. ఆనతీవమ్మ యిపుడె నీయాన తీగ,బోణి కూరిమి మదిలోనఁ బూని వేగ
దానవారిని దెత్తు నీదానవారి, రాశినడుమను వెలయుద్వారకకు నరిగి. 43

ఉ. మేలు బలా బలానుజుఁడు మేటి సుమీ యబలా బలారియుం
జాలఁడు వానివైఖరులు సారమతి న్నుతిసేయ నట్టిగో
పాలకుమారుఁ గోరి శిశుపాలుని నొల్లక యున్నదాన విం
కేల మదిన్ విచార మిపు డీక్రియ చక్రి కెఱుంగఁ జేయుమా. 44

ఉ. ఓరమణీలలామ యిటు లూరక కోరికలూర సారకుం
బేరుకొనంగ నేమిటికిఁ బెక్కువిధంబుల నీకు వేఁడు కా
తీరున నాచరించెదము తెల్పుము నిక్కము మీఱ మేము నీ
వారము గామె యేమి పగవారమె వేఱె మఱొండు నేర్తుమే. 45

క. వల నగునీకోరిక మా, వల నగుఁ గల నైనఁ జింత వలవదు మదిలోఁ
గల దెఱిఁగింపవె ముద్దులు, చిలుకఁగ మాతోడఁ బలికి చిలుకలకొలికీ. 46

క. నవలా నెఱ నగునీయభి, నవలావణ్యంబు తెఱఁగు నళినాక్షునకుం
జెవిసోఁకినంతమాత్రనె, తవిలి వెసన్ రాకయున్నె తత్పరమతి యై. 47

తే. సతతసత్యవ్రతునిగుణాన్వితుని మతిమ, హితునివిహితునిమాపురోహితునిసుతునిఁ
బనుపఁగదవమ్మ సరగ నోపసిడి బొమ్మ, తడ వొనర్పక యాజనార్దనునిఁ బిల్వ. 48

క. అనునెచ్చెలినునుఁబలుకులు, విని యచ్చెలి మదిఁ జెలంగి వెర వెఱుఁగఁగఁ గ
ప్పినఘనవినయాన్విత ర, మ్మని తనదరి నునిచి మిగుల హర్షము వెలయన్. 49

ఉ. చంచలనేత్ర నీదునెఱజాణతనంబున మన్మనోరథం
బంచితవైఖరిన్ సఫలమై పెనుపొందుఁగదా గదాగ్రజుం
గాంచినయంత మంచిమణికాంచనదివ్యవిభూషణంబు లి
ప్పించెద నీకు నే నెలమిఁ బెట్టెఁడు పెట్టెడు నింపు మీఱఁగన్. 50

క. నీమహిమకు సరివోల్పఁగ, నీమహి మఱి కలదె తలుచు లేమిటికిటు లో
రామరొ నీ విపు డనినధ, రామరు నిచ్చటికిఁ దెమ్ము హర్షం బెసఁగన్. 51

ఉ. నావుడుఁ జెల్మికత్తె నృపనందనకుం దనకూర్మి చూపుచుం
బావనచిత్తుఁ డై నిగమపారగుఁ డై వెలుఁగొందు చున్నభూ 52

దేవకుమారుఁ జేరి సారెదిన్ మధురోక్తులఁ దత్ప్రకార మెం
తో వెరవొప్పఁగాఁ దెలిపి తోడ్కొని ముందరఁ దెచ్చి నిల్పినన్. 52

క. జగతీసురసుతు శశిముఖి, జగతిం గూర్చుండఁజేసి సవినయనిర్వ్యా
జగతిం బూజ లొసంగి త్రి, జగతీస్తుతసుందరాంగి చతురత ననియెన్. 53

చ. సరసిరుహాసనాన్వయనిశాకర నన్ గృప నాదరించి యి
త్తతి నుపకార మొక్కటి యుదంచితలీల నొనర్చి లోకభా
సుర మగుకీర్తిఁ జెంది సరసుల్ నుతిసేయఁ జెలంగు మూర్విపై
నరయఁ బరోపకారవిమలాత్ములు గారె బుధేంద్రు లెప్పుడున్. 54

తే. విను ధరామర హరికి విద్వేషి యగుచుఁ, బాపమతి రుక్మి నను శిశుపాలుఁ డనెడు
పాపదౌర్భాగ్యునకు నేఁడు పరిణయంబొ, నర్పనూహించియున్నాఁడు దర్ప మెసఁగ.

క. ఈకుండినపతి శక్తుఁడు, గాకుండినవాఁడు వానిఁ గాదని హరియున్
రాకుండిన నిపు డతనికి, నీకుండినఁ గోర్కెలెల్ల నెట్లొనఁగూడున్. 56

ఉ. ఓవసుధాసుధాశనకులోత్తమ చిత్త మహర్నిశంబులున్
బావని యైనకృష్ణపదపంకరుహద్వయి సేవఁ గోరుచుం
గేవలకౌతుకస్ఫురణఁ గేరుచు నున్నది యెన్నిభంగులన్
నీ వరుదెంచి యివ్విధము నేర్పున శౌరికి విన్నవింపవే. 57

క. భూసురనిరుపమగుణగణ, భాసురఘనరాజహంసపరిచితలీలా
వాసంబు గాక మానస, కాసారం బేక్రియం బ్రకాశత నొందున్. 58

చ. మెఱయుచు నీలవర్ణమున మీఱి నిరంతరచంద్రికాప్రభా
కరసముదంచితాంబరముఁ గప్పి గభీరతరప్రణాదభా
సురుఁ డగునట్టియాఘనుని సొంపుగఁ దోడ్కొని తెచ్చినప్పుడే
యిరవుగ భూరివృష్టిఁ గురియింతుఁ జుమీ ద్విజముఖ్య యర్మిలిన్. 59

క. సాక్షులు సుమిత్రామర, సాక్షులు నీకొసఁగుదాన నభిమతము కృపా
వీక్షణమునఁ గన్గొని నీ, వీక్షణమున ద్వారవతికి నేఁగుము విప్రా. 60

శా. నీకుం జెప్పెడిదేమి భూమిసుర యాసీరేజపత్త్రాక్షుతో
నాకార్యంబు సమస్తముం దెలిపి యానందంబు గావించి య
స్తోకానేకపవాహవాహినులతోఁ దోడ్తెమ్ము పొమ్మంచుఁ దా
నేకాంతంబునఁ గొన్నిమాట లపుడే యేర్పాటుగాఁ దెల్పినన్. 61

క. విని బాడబకులతిలకుఁడు, ఘనతరపరితోషహృదయకమలుం డగుచున్
వనితామణిఁ గన్గొని యి, ట్లనియెన్ మృదువచనరచన లురారంగన్. 62

క. లలనా సురుచిరతరలీ, లల నాన్నృపుఁ దెత్తు వేయులాగులఁ దెలుపన్
వలెనా మదిఁ దలఁపఁగ నీ, వలె నా కిఁక నాప్తలైనవారలు గలరే. 63

క. ఆరాధించును రే పవ్విభుఁ, డరుదెంచినఁ గాంచి మోదమందెదవు సుమీ
హారికరులఁ దఱుముకరణిరయి, హారికరులం దఱుము దెల్ల హరిణాంకముఖీ. 64

మ. మానిని యేవిచారమును మాని నిరంతరకౌతుకంబులో
నాని చెలంగుమంతయును జనార్దనుఁ డానరనాథయూథముల్
భూనుతవిక్రముం బలుఁ బోవఁగఁ ద్రోలి నిను౯ వరించు నం
చానతి నాక్షికిం దెలిపి యానతిఁ గైకొని సాదరంబుగ౯. 65

తే. కాముకార్యంబు మదిఁ బూని కార్యసక్తి, దనర నరిగినయామరుత్తనయుపోల్కి
రామకార్యంబు మదిఁ బూని కార్యసక్తి, దనర నరిగెను భూమరుత్తనయుఁ డంత.

క. మనుజాధిపసుత యివ్విధి, మున దామోదరునిఁ బిల్వ భూసురవర్యుం
బనిచియును నమ్మఁజాలక, ఘనతరచింతాభరంబు గడలుకొనంగ౯. 67

క. ఎద దిగులు గదిరి మిసుల౯, వదనాంభోరుహము వంచి వదలనికోర్కుల్
గదిగొన నునుఁ జెక్కునఁ గే, ల్గదియించి విరించి నెంచి కళవళ మొదవ౯. 68

తే. కనుఁగొనలబిల్ల కెంపుకజ్జలంబు, కరము గ్రయ్యన లేఁజెక్కుఁగవకు జాఱ
వేఁడినిట్టూర్పుఁ దెమ్మెరల్ వ్రాఁడిమిరాల, నుసునసురటంచుఁ గృశియించుచున్నఁ జూచి.

మ. కంపితసంపుటై చెలిమికత్తియ యొక్కతె బిత్తరి౯ విమ
ర్శింపను గొల్ల మెద్దియును జేయఁగ నేరక చెంగటం బ్రవ
ర్తింపఁగఁ గొంతసేపునకుఁ దెల్వి వహించి నృపాలపుత్త్రి బ
ల్గొంపుననుండు వాతెఱ చలింపఁగ వారలతోడ నిట్లను౯. 70

సీ. చెలులార భూసురశ్రేష్ఠుఁ డాద్వారక కరిగె నరవఱిఁ జేరఁగలఁడు
చేరి యన్యులకుఁ బ్రవేశింపఁ జెల్లనిరాజశుద్ధాంతు మేలీలఁ జొరఁగఁగలఁడు
చొచ్చి యచ్చట దివ్యశోభానిరూఢిఁ గ్రీడించునచ్యుతు నెట్లు కాంచఁగలఁడు
కాంచి వంచనలేక పద్మనాభునకు నా తెఱఁగెల్ల నెబ్బంగిఁ దెలుపఁగలఁడు

తే. తెలుపఁగా విని విభుఁడు మదిం జెలంగి, యెవ్విధంబున న న్వరియింపఁగోరుఁ
గోరి యేక్రియ నెగ్గించుకొనక వచ్చు, వచ్చి యేగతి నిమ్మహీవరులఁ గెలుచు. 71

చ. గెలుచుట దుస్తరంబు పరికింపఁగ నంబుజసూతి యీగతిం
జలము వహించె నించుకయు శాంకరికిం గృపఁ గల్గదయ్యె ని
మ్ముల నొనరించుదేవగురుపూజలు నిర్మలదానధర్మముల్
ఫల మిడఁ జాలవయ్యె మదిఁ బాయదు కూర్మి యిఁకేమి సేయుదు౯. 72

శా. రాజీవేక్షణుఁ డేప్రొద్దు నిచటికి౯ రాకున్న గర్వాంధులై
రాజశ్రేణులఁ గూడి చేదిపతి సంరంభంబుతోఁ జేరి వి
భ్రాజల్లీలల న న్వరించునపుడే పంతంబు చేకూరి యీ
వ్యాజస్వాంతుఁడు రుక్మి యుబ్బుఁగద రే యత్యంతసంతుష్టుఁడై. 73

తే. ఎన్నఁ డావెన్నుఁ డాదరం బెసఁగఁ జూచు, నెన్నఁ డేరుక్మిసంతంబు లెల్ల నణఁగు
ఖిన్నుఁడై చేదిజగతీశుఁ డెన్నఁ డుడుకు, నిష్టభోగానుభవసిద్ధి యెన్నఁ డొదవు.

వ. అని పలికి కలికి తనమనంబున. 75

ఉ. చిక్కనిగుబ్బచన్ను లెదఁ జేర్చి కవుంగిట బిగ్గఁ గూర్చి తేఁ
జెక్కులము ద్దొసంగి తమిచేఁ గళలంటినఁ బొంగి నెమ్మదిన్
జొక్కి సుధాధరంబు చవి చూపి గళధ్వను లుప్పతిల్లఁ గా
న్మక్కువ నవ్విభుం గలసి మాయనికేళిఁ జెలంగు టెన్నఁడో. 76

క. ఎగ్గించుక నే నతనిన్, సిగ్గున దగ్గఱకయున్నఁ జెలువుఁడు తమిచే
డిగ్గునఁ గైకొని కౌఁగిట, బిగ్గరఁ గదియించి రతులఁ బెనఁచుట యెప్పుడో. 77

ఉ. నిచ్చలు విచ్చలవ్విడిని నిద్దపుటద్దపుగుంపుసొంపుగా
గ్రుచ్చినపచ్చమానికపుగోడలనీడలు గాంచి యిచ్చలన్
మచ్చుచు నచ్చము త్తియపుమేడల గొజ్జఁగిపువ్వుసెజ్జపై
ముచ్చిక నచ్యుతుం గదిసి మన్మథకేళులఁ గేరు టెన్నఁడో. 78

క. అకటా శకటాసురహరుఁ, డొకటం బ్రకటానురాగ మొదవఁగఁ గాను
ఖ్యకటాక్షంబునఁ గోరిక, వికటము గావింప కెప్పుడు వీక్షించునొకో. 79

తే. అనుచు మోహాతిరేకంబు పెనఁగొనంగ, నాత్మలోపల నూహించు చున్న నెలఁత
పనికిఁ గోర్కిఁధించి మతిరాయు నిబ్బరపుటిగాక్రి, మానసమునందు నంటి యాముద్బెంటిపి.

ఉ. కట్టదు పట్టుపుట్టములు కాంచదు కాంచనకాంచికాదులన్
బెట్టదు కొప్పువిప్పగను గెంచదు కొంచెపుటించుబోదులన్
ముట్టదు వీణపాణులను ముద్దుఁజెలుల్ దరిఁ జేరఁ గేరి చే
పట్టదు పట్టెఁ దన్న మొకపట్టున నైన భుజింప దింపుగన్. 81

క. పాడదు మృదుగానము తమి, నాడదు నెచ్చెలులఁ గూడి యార్తులఁ గృపతోఁ
జూడదు హృదయాంతరమున, వీడదు చింతాభరంబు వెంఁదుక యెప్పుడున్. 82

ఆ. కురులుఁ దువ్వి ముడిదిద్ది విరులు నింపదు కుచ, గిరుల సుగంధగొన్నసరులు విప్ప
దురర జలకమాడ దద్దంబుఁ గన్గొని, తిలక మిడదు నిలువుటద్దమునను. 83

తే. పసను బొంగారుబంగారుపళ్లెరమున, దసిరసాన్నంబు చిడి పాననిష్టుటన్న
మసలుచును జేరి యుసురని బిసరుహాక్షి, కసర కసిగాటులుగ వెస మెసఁగి లేచు. 84

ఉ. చెంతలఁ జేరి యూడిగపుఁజేడియ లాకుమణాంగు లిచ్చినం
గాంత పరాకు మీఱ నవి గైకొని వేనలి నుంచు మంచిసే
మంతు లొసంగినం గుసుమమంజులగాత్రి విడెంబు సేయు నిం
కెంతని తెల్పఁ గొక్కము నవేందునిభాస్యవియోగతాపముల్. 85

మ. తలయూఁచున్ గనుదోయి మూయుఁ దనలోఁ దా నవ్వుచుం బిల్వకే
పలుకుం జెక్కునఁ జెయ్యి సేర్చు సఖులం బ్రార్థించు నిట్టూర్పుగా
డ్పులు నించున్ బయ లాలకించు విధిఁ దిట్టున్ గట్టురాపట్టికిన్
బలుచందంబుల మ్రొక్కుఁ జొక్కు హరిపై భావంబు రంజిల్లఁగన్. 86

సీ. కరిరాజయాన భాసురశీతకరచూతశరవాతపోతవైఖరుల కులుకు
ముకురాభవదన హంసకశోకపికకీరనికరారవముల కేవకుఁ దలంకు
ధవళాబ్జనయన యాసవవానవగానరవసూనమాలికాప్రతతిఁ దెగడు
తరుణీలలామ నూపురజాలవరచేలహారనీలమణిభూషణాదు లిడదు

తే. కలికి ఘనసారహిమపూరగంధసార, సారసారంగనాభికాసాంకవాది
మేదురామోదశాదంబు మేనఁ బూని, యలఁద నొల్లదు సంతాప మతిశయిల్ల. 87

తే కలఁగు జెలఁగును మాధవాగమనలీల, ద్విజముఖంబునఁ దేటగాఁ దెలుపుటయును
వొలఁగు మెలఁగును విధు నెమ్మిఁ జూడఁ, దమిని బలుమాఱు నమ్మదదంతియాన.

తే. అలికిఁ జులుకిత మగుకరువలికిఁ గులికి, ములికిగను లేయుమరుని యంకిలికిఁ దొగల
చెలికిఁ గలకంఠముల హాళాహాళికిఁ గనరు, చిలుకుచిలుకలపలుకుల కులికి కలికి. 89

సీ. అందమా నీకు మిళిందమా శారికాబృందమా ఫుల్లమచందమావు
పైరమా నీకు మయూరమా చంద్రికాసారమా శౌరికుమారమార
వంతమా నీకు లతాంతమా కీరశకుంతమా హార్దవసంత మదిని
మేనమా నీకు మరాళమా కోకిలజాలమా మందవాతూల మఱియుఁ

తే. శౌరి యాకీర్తి నీతి సో గోరి మీ జాతి, దారి తొలఁగి మెలంగుట తగవు గాదు
వాదురాఁగద్దు మీకిటులన్ వద్దటంచు, నెంచుఁ జలియించుఁ గొంచు నమ్మించుబోఁడి.

సీ. జున్ముని నెమ్మోముఁ దమ్మి నిమ్ముగఁ గ్రమ్మి యెమ్మెతోఁ ద్రిమ్మరుతుమ్మెదలకుఁ
గమ్మనికపురంపుదిమ్ములఁ గలదుమారమ్ముచిమ్మెదుకమ్మదెమ్మెరలకు
హుమ్మనిక్రమ్మర దొమ్మిఁ జిమ్మిలిరేఁగి నెమ్మదిఁ గూయుపికమ్ములకును
గుమ్మనివీణె లొక్కుమ్మడి మ్రోయ రాకొమ్మలు సేయుగానమ్ములకును

తే. చాలి మంతంతకును వీడి తూలి జాలి, బాలికామణి సోలి విరాలిఁ జేలి
మే లిడఁగఁ జాలి తనపాలియేలికైన, శూలి గారాపుటిల్లాలి నోలిఁ బొగడు. 91

తే. భక్తిఁ గంగునఁ దత్తిం జిత్తచిత్తి, స్వస్తి ఘాగుణోత్తమునిమీఁద హస్తుకొల్పి
బత్తి దనకడిపిత్తతి నత్తతిని మృ, దూత్తరంబులఁ జెలికత్తె లొత్తి యనిరి. 92

క. మగువా హరి యిఁక నీసా, మ్మగు వానికి నీవుఁ బెండ్లి యగు నిటు వగవం
దగవా జగములు పొగడం, దగ వాసవవైభవమునఁ దనరుదు వెపుడున్. 93

తే. విందుమహిమాన్యుఁడైన గోవిందుమహిమ, గణనసేయుడఁ జాలఁడటచుట్టుకైదువయును
దరముఁ గరమునఁ బూని పోఁ దఱుముఁ గరము, సమరతలమునఁ నరిసమూహములనెల్ల.

